# జాతీయ గీతమాల





సేకరణ :

ఆర్. పద్మ

గ్రా॥ కానుకుంట

మం॥ జిన్నారం, జి॥ మెదక్. (ఆం.ప్ర.)

Acc. No: 23146



ప్రకాశకులు :

**సిద్దేశ్వర పబ్లికేషన్స్**

10-7-1999

కాపీరైట్) (వెల రూ. 12-00

# కృతజ్ఞతాభి వందనం

అశేష ప్రేక్షక అభిమానులకు పూజ్యనీయులైన ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులకు ప్రియమైన స్నేహితులకు తోటి విద్యార్థినీ విద్యార్థులకు నా హృదయ పూర్వకమైన నమస్కారాంజలులు. తెలుగు గడ్డపై జన్మించిన భారతమాత ముద్దు బిడ్డలైన జాతీయ నాయకులెందరో విప్లవ వీరుల వీరనారీమణుల గురించి దేశమాత కోసం దేశభక్తి కోసం ఆ కవిరత్నములెందరెందరో మహామహులు రచించిన దేశభక్తి గేయాలను సేకరించి ఈ చిరు పొత్తిక అను "జాతీయ గీతమాల" ను మీ కందిస్తున్నాను. ఈ "జాతీయ గీతమాల" విద్యార్థినీ విద్యార్థులను ఉత్తేజితులను చేసి దేశభక్తి స్ఫూర్తి కలుగ చేయ గలదని నేటి బాలలే రేపటి పౌరులుగా తీర్చిదిద్దుటకు ఉపయుక్తముగా ఉండగలదని ఆకాంక్షిస్తూ భగవంతుని ప్రార్థిస్తున్నాను.


ఇట్లు

మీ విధేయురాలు

**ఆర్. పద్మ**

గ్రా॥ కానుకుంట, మం॥ జిన్నారం,

జిల్లా మెదక్.

# వందే మాతరం

వందే మాతరం
సుజలాం సుఫలాం మలయజ శీతలాం
సస్యశ్యామలాం మాతరం ||వందే||

శుభ్రజ్యోత్స్న పులకిత యామినీం పుల్లకు సుమిత
ద్రుమదల శోభినీం, సుహాసినీం, సుమధుర భాషిణీం
సుఖదాం వరదాం మాతరం ||వందే||

త్రిశంత్కోటికంఠ కలకల నినాదకరాలే
ద్విత్రింశత్ కోటి భుజైర్ ధృత కర కర వాలే
కేబోలే మాతుమి అబలే
బహుబల ధారణీం నమామితారిణీం
రిపుదల వారిణీం మాతరం ||వందే||

తుమి విద్యాతుమిధర్మ తుమిహృది తుమి మర్మ
త్వంహ ప్రాణాశ్శరీరే బాహుతే తుమి మాశక్తి
హృదియే తుమి మా భక్తి తుమార
ప్రతిమాగడి మందిరే మందిరే ||వందే||

త్వంహి దుర్గా ప్రళయ ప్రహరణ ధారిణీ
కమలా కమల దళ విహారిణీ
వాణీ విద్యాదాయినీ నమామిత్వాం
నమామి కమలాం అతులాం అమలాం
సుజలాం సుఫలాం మాతరం ||వందే||

# మా తెలుగు తల్లికి

--- సుందరాచారి

మా తెలుగు తల్లికి మల్లె పూదండ
మా కన్న తల్లికి మంగళారతులు ||మా తెలుగు||

కడుపులో బంగారు కనుచూపులో కరుణ 2
చిరు నవ్వులో సిరులు దొరలించు మాతల్లి ||మా తెలుగు||

గల గలా గోదారి కదిలిపోతుంటేను
బిర బిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొరులుతాయి ||మా తెలుగు||

అమరావతీ నగర అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు ||అమరావతి||

ికక్క్రయ్య కలములో తియ్యందనాలు
ిత్యమై నిఖిలమై నిలచి యుండేదాక ||మా తెలుగు||

ుద్రమ్మ భుజశక్తి, మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి, కృష్ణరాయని కీర్తి
మా చెవుల రింగుమని మారుమ్రోగే దాక
నీ ఆటలే ఆడుతాం - నీ పాటలే పాడుతాం
జై తెలుగు తల్లి ! జై తెలుగు తల్లి !

జై తెలుగు తల్లి !

# జననీ జన్మ భూమిశ్చ

**(బొబ్బిలి పులి)** **... బాలు**

పల్లవి : జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపీ గరీయసీ - స్వర్గాదపీ గరీయసీ

చరణం : ఏ తల్లి నిన్నుకన్నదో ఆ తల్లినే
కన్న భూమి గొప్పదిరా ॥జననీ॥

నీ తల్లి మోసేది నవమాసాలేరా
ఈ తల్లి మోయాలి కడవరకురా కట్టె కాలేవరకురా
ఈ ఋణం తల కొరివితో తేలేనురా
ఈ ఋణం ఏ రూపాన తీ రేదిరా
ఆ రూపమే ఈ జవానురా త్యాగానికి
మరోరూపు నువ్వురా ॥జననీ॥

చరణం : గుండె గుండెకే తెలుసు గుండె బరువు ఎంతో
ఆ గుండెకే తెలుసు ఈ గుండె బాధెంతో
ఈ గుండె రాయి కావాలి ఆ గుండెలో ఫిరంగులు మోగాలి
మనిషిగా పుట్టిన ఓ మనిషి మారాలి నువ్వు రాక్షసుడిగా
మనుషుల కోసం ఈ మనుసుల కోసం
నీ మనుసుల కోసం ॥జననీ॥

# గాంధి పుట్టిన దేశమా

**(పరిత్రబంధం)**

గాంధి పుట్టిన దేశమా ఇది నెహ్రూ కోరిన సంఘమా ఇది
సామ్యవాదం రామరాజ్యం సంభవించే కాలమా ॥గాంధి॥

సస్యశ్యామల దేశము అయినా నిత్యం క్షామము
ఉప్పొంగే నదుల జీవజలాలు ఉప్పు సముద్ర పాలు
యువకుల శక్తికీ భవితవ్యానికి ఇక్కడ తిలోదకాలు
ఉన్నది మనకు ఓటు బ్రతుకు తెరువుకే లోటు ॥గాంధి॥

సమ్మె ఘోరావు దొమ్మి బస్సుల దహనం లాటీ
శాంతి సహనం సమధర్మం పై విరిగెను గూండాలాటి
అధికారంపై పెనుగులాటలో అన్నదమ్ముల పోటీ
హెచ్చెను హింసా ద్వేషం ఏమౌతుంది దేశం ॥గాంధి

వ్యాపారాలకు పర్మిట్ వ్యవహారాలకు లైసెన్స్
అర్హతలేని ఉద్యోగాలకు లంచం యిస్తే ఓ యస్
సిఫార్స్ లేనిదే శ్మశానమందు దొరకదు రవ్వంత చోటు
పేరుకు ప్రజలది రాజ్యం పెత్తందార్లదే భోజ్యం ॥గాంధి

# పుణ్యభూమి నా దేశం

**(మేజర్ చంద్రకాంత్)**

పుణ్యభూమి నా దేశం నమో నమామి
ధన్య భూమి నా దేశం సదా స్మరామి
నన్ను కన్న నా దేశం సదా స్మరామి
అన్నపూర్ణ నా దేశం సదా స్మరామి
మహా మహుల కన్న తల్లి నాదేశం
మహోజ్వలిత చరిత గన్న భాగ్యోదయ నా దేశం

చరణం : అదిగో ఛత్రపతి ధ్వజమెత్తిన ప్రజాపతి
మదోన్మాద శక్తులు చురకత్తులు ఝుళిపిస్తే
మానవతుల మాంగల్యం మంటగలుపుతుంటే
అక్షుద్ర రాజకీయాలకి రుద్రనేత్రుడై లేచి
మాతృభూమి నుదిటిపై నెత్తుటి తిలకం దిద్దిన
మహావీరులు సౌరభౌముడు.

చరణం : అడుగో అతి భయంకరుడు కట్ట బ్రహ్మన్న
అది వీరపాండ్య వంశాంకుర సింహగర్జన
ఒరేయ్ ఎందుకు కట్టాలిరా శిస్తు
నారు పోసావా నీరు పెట్టవా

కోత కోసావా కుప్ప నూర్చావా ఒరేయ్ తెల్లకుక్కా
కష్టజీవుల ముష్టి మెతుకులు తిని బ్రతికే నీకు
శిస్తెందుకు కట్టాలిరా
అని పెళపెళ సంకెళ్ళు తెంచి స్వరాజ్య పోరాటమెంచి
ఉరి గొయ్యల ఉగ్గుపాలు తాగాడు
కన్న భూమి వడిలోనే ఒరిగాడు

చరణం: కో: అదిగదిగో అదిగదిగో
ఆకాశం భళ్ళున తెల్లారి వస్తున్నాడదిగో
మన అగ్గి పిడుగు అల్లూరి 2

యెవడురా నా భరత మాతని కప్పమడిగిన తుచ్ఛుడు
ఎవడు ఎవడా పొగరు పట్టిన తెల్ల దొరగాడెవ్వడు
బ్రతుకు తెరువుకు దేశమొచ్చి బానిసలుగా మమ్మునెంచి
పన్ను అడిగె కొమ్ములొచ్చిన దమ్ములెవడికి వచ్చెరా
బడుగు జీవులు భగ్గుమంటే ఉడుకు నెత్తురు ఉప్పెనైతే
ఆచంద్ర నిప్పుల గండ్ర గొడ్డలి నన్ను గడతది చూడరా
అన్నా ఆ మన్నెం దొర అల్లూరిని చుట్టిముట్టి
మంది మార్బలమెట్టి మరపిరంగు పెక్కు పెట్టి
వంద గుళ్ళు ఒక్కసారి పేల్చితే
వందేమాతరం వందేమాతరం 2
వందే మాతరం అన్నది ఆకాశం

చరణం : అజాదు హిందు ఫౌజు దళపతి నేతాజీ
ఆ ఖండ భరత జాతి కన్న మరో శివాజీ
సాయుధ సంగ్రామమే న్యాయమని
ప్రతి మనిసోక సైనికుడై ప్రాణార్పణ చెయ్యాలని
హిందు ఫౌజు జై హిందని నడిపాడు
గగన, శిలలకెగసి కనుమరుగై పోయాడు
జోహార్ జోహార్ సుభాష్ చంద్రబోస్ ॥జోహార్॥

చరణం : గాంధీజీ కలలుగన్న స్వరాజ్యం
సాధించే సమరంలో అమర జ్యోతులై వెలిగే
ధృవతారల కన్నది ఈ దేశం
చరితార్థుల కన్నది నా దేశం నాదేశం ॥పుణ్య॥



# గాంధి పుట్టిన దేశమా

(పవిత్రబంధం)

గాంధి పుట్టిన దేశమా ఇది నెహ్రూ కోరిన సంఘమా ఇది
సామ్యవాదం రామరాజ్యం సంభవించే కాలమా ||గాంధి||

సస్యశ్యామల దేశము అయినా నిత్యం క్షామము
ఉప్పొంగే నదుల జీవజలాలు ఉప్పు సముద్ర పాలు
యువకుల శక్తికీ భవితవ్యానికి ఇక్కడ తిలోదకాలు
ఉన్నది మనకు ఓటు బ్రతుకు తెరువుకే లోటు ||గాంధి||

సమ్మె ఘెరావు దొమ్మి బస్సుల దహనం లాటి
శాంతి సహనం సమధర్మం పై విరిగెను గూండాలాటి
అధికారంపై పెనుగులాటలో అన్నదమ్ముల పోటీ
హెచ్చెను హింసా ద్వేషం ఏమౌతుంది దేశం ||గాంధి||

వ్యాపారాలకు పర్మిట్ వ్యవహారాలకు లైసెన్స్
అర్హతలేని ఉద్యోగాలకు లంచం యిస్తే ఓ యస్
సిఫార్సు లేనిదే శ్మశానమందు దొరకదు రవ్వంత చోటు
పేరుకు ప్రజలది రాజ్యం పెత్తందార్లదే భోజ్యం ||గాంధి||

# దేశమ్ము మారిందోయి

**(రాముడు భీముడు)** **పెండ్యాల ఘంటసాల, సుశీల**

పల్లవి : దేశమ్ము మారిందోయి కాలమ్ము మారిందోయి
కష్టాలు తీరేనోయి సుఖాలు నీవేనోయి

చరణం : కొండలన్ని కొట్టి కో : కొట్టి
డాములెన్ని కట్టి కట్టి
నీళ్ళను నిలిపి నిలిపి
చేలను తడిపి తడిపి

మె : మురిసే పచ్చని రోజు మనకూ వస్తుందోయి వస్తుంది ॥దేశ॥

డు : కండల్ని కరగదియ్యి బండల్ని విసిరివెయ్యి నీ దేలే పై చేయి

మె : భాగ్యాలు పండునోయి గాదెలు నిండునోయీ
సిరులు చిందునోయి ఆశలు అందునోయీ
చేయి చేయి కలవాలి రావయ్యా బావయ్యా

డు : గ్రామాలు బాగుచెయ్యి దీపాలు వెలుగనియ్యి

మె : జేజేలు నీకోయీ
చిట్టి చీమలన్నీ పెద్ద పుట్ట పెట్టుకదా
ఎందరో తమ రక్తాన్ని చిందించిరి కదా

డు : అక్రమాల అసూయలకు ఆనకట్ట యిదె యిదే
అనుభవమ్ము నీదేనోయి ఈ ఆనందం నీదేనోయీ
నిజమౌ శ్రమజీవి అంటే నీవే నోయీ

# ఇదేనా మా దేశం

**(జీవితం)**

చరణం : ఇదేనా మాదేశం - ఇదా భరతదేశం

చరణం : గణిలో పనిలో కార్ఖానాలో
పాటుబడే దౌర్భాగ్య జీవులను
తిండి బట్ట యేర్పరుప బూనిన
పండిత జవహారు ప్రభవించినది ॥ఇదే॥

చరణం : ధనవంతుల మేడల నీడలతో
నిరుపేదల జీవిత యాతనలు
కానరాని గతి కన్నుమూసి
లోకాన ధర్మశాస్త్రాలు చాబునది.



# భారత మాతకు జేజేలు

(బడిపంతులు) ఘంటసాల

పల్లవి : భారత మాతకు జేజేలు బంగురుభూమికి జేజేలు 2 భారత
ఆసేతు హిమాచల సస్యశ్యామల జీవధాత్రికి జేజేలు

చరణం : త్రివేణి సంగమ పవిత్ర భూమి
నాలుగు వేదములు పుట్టిన భూమి
గీతామృతమును పంచిన భూమి
పంచశీల బోధించిన భూమి 2 ॥భారత॥

చరణం : శాంతి దూతగా వెలసిన బాపూ
జాతి రత్నమై వెలసిన నెహ్రూ
విప్లవ వీరులు వీర మాతలు 2
ముద్దు బిడ్డలై మురిసిన భూమి ॥భారత॥

చరణం : సహజీవనము సమభావనము
సమతా వాదము వేదముగ
ప్రజాక్షేమము ప్రగతి మార్గము
లక్ష్యములైన విలక్షణ భూమి ॥భారత॥

# నా దేశం కోసం

(పెత్తందార్లు) ఘంటసాల

పల్లవి : నా దేశం కోసం నడుంబిగించి నాగలి పట్టాను
జనతావాధం సౌఖ్యం కోసం స్వర్గం
క్రిందికి తెస్తానోయ్ 2 ||నాదేశం||

చరణం : పాతాళంలో గంగను తీసి
పైరుకు ప్రాణం పోస్తానోయ్ ||పాతా||
చిగురు పోయిన జీవనాదులకు
జవసత్వం కురిపిస్తానోయ్ ||నాదేశం||

చరణం : సిరులు పొంగిన జీవగడ్డకు
పుత్రులమై జన్మించామోయ్
కృషితో నాస్తి దుర్భిక్షం అని
సమాజమును నిర్మిస్తామోయ్

కో : నవ సమాజమును నిర్మిస్తామోయ్ ||నాదేశం||

చరణం : గాంధీ జవహారు దివ్య బోధనలు
ముందు దారి చూపించెను ||గాంధీ||
త్యాగం ధర్మం 2 ఆదర్శంగా
నాగలి జెండా కావాలిరా ||నాదేశం||

# మన స్వతంత్ర భారతం

(దేశద్రోహులు) ఘంటసాల

పల్లవి : మన స్వతంత్ర భారతం మహామహుల త్యాగఫలం 2
మానధనుల శౌర్యఫలం నవ స్వతంత్ర భారతం 2

చరణం : సాహసి రుద్రమదేవి కరవాలం కళకళలో 2
కదం తొక్కు పరాక్రమం కలకాలం మనది
మన కన్నెలని మన కండలవి
తర తరాల స్వతంత్రించి తనకు దర్మ చట్టమైన
ప్రతిభామణి మహామంత్రి పండిత నెహ్రూ తర

అందరి కృషి పలితంగా జనం మెచ్చుగ జగంమెచ్చ
అవతరించే అతిశయించే ॥మన॥

చరణం : పచ్చని పైరుల పండుగ చేసే బాక్రానంగల్ పెన్నిధి 2 గనిలో
దాగని ఖనిజ సంపదల వెలుగుకు తెచ్చే నైవేలి యంత్ర యుగానికి
విజయ పతాకం ఖిలాయి కర్మాగారం సాగర యానం సరిపడు
నౌకల నిర్మాణించే వైశాఖ ఇదే రీతిగా ఇదే తీరుగా నలుమూలల
సిరిసంపద లొలికే నవ భారత దేశంలో 2 మన స
భారత దేశంలో

చరణం : పున్నమికే మొయిలు సోకి వెన్నెల చిరు చీకటై మ
చాటునుండి చలి పిడుగులు కురిసెనే దారుణం
దారుణం
మన వాడనుకున్న వాడే భాయి భాయి అన్నవాడే 2
భూరి తరచి దురాక్రమన చేసెనే దొంగ వ్రేటు
దారుణం దారుణం

# నీ ధర్మం నీ సంఘం

**(కోడలు దిద్దిన కాపురం)**

పల్లవి : నీ ధర్మం నీ సంఘం నీ దేశం నువు మరవద్దు
జాతిని నడిపి నీతిని నిలిపిన
మహనీయులనే మరవద్దు. ॥నీ ధర్మ॥

చరణం : సత్యం కోసం సతినే అమ్మిన దెవరు ?
హరిశ్చంద్రుడు.
తండ్రి మాటకై కానల కేగిన దెవరు ?
శ్రీ రామ చంద్రుడు
అన్న సేవకే అంకితమైనది ఎవరన్నా ?
లక్ష్మన్న.
పతియే దైవమని తరించి పోయిన దెవరమ్మా ?
సీతమ్మా.
ఆ పుణ్య మూర్తులు చూపిన మార్గం
అను సరించుటే ధర్మం
అనుసరించుటే నీ ధర్మం. ॥నీ ధర్మం॥

చరణం : చేప కూడుతో సమతను నేర్పిన
నాటి పలనాటి బ్రహ్మన్న
మేడి పండులా మెరిసే సంఘం గుట్టు విప్పెను వేమన్న
వితంతువుల విధి వ్రాతలు మార్చి
బ్రతుకులు పండించే "కందుకూరి"
తెలుగు భారతిని ప్రజల బాషలో
తీర్చి దిద్దెను "గురుజాడ"

ఆ :　　సంస్కర్తల ఆశయరంగం
నీవు నిలిచిన సంఘం
నీవు నిలిచిన ఈ సంఘం　　　　　నీ ధర్మం

చరణం :- స్వతంత్ర భారత రథసారధియై
సమరాన దూకే నేతాజీ
సత్యాగ్రహమే సాధనమ్మగా
స్వరాజ్యమే తెచ్చె బాపూజీ
గుండె కెదురుగా గుండె నిలిపెను
ఆంధ్రకేసరి టంగుటూరి
తెలుగు వారి కొక రాష్ట్రం కోరి
ఆహుతి అయెను అమరజీవి
ఆ దేశభక్తులు వెలసిన దేశం
నీవు పుట్టిన భారత దేశం
నీవు పుట్టిన ఈ దేశం　　　　　నీ ధర్మం



# నా జన్మభూమి

(సిపాయి చిన్నయ్య) ఎం.ఎస్. విశ్వనాథం, ఘంటసాల

పల్లవి : నా జన్మ భూమి ఎంత అందమైన దేశము
నా యిల్లు అందులోన కమ్మని ప్రదేశము
నాసామిరంగా హోయ్‌హోయ్ నా సామిరంగా
నడిచే దారిలో నవ్వే పువ్వులు
శాంతి నాదాలతో ఎగిరే పిట్టలు
పచ్చని పంటలు వెచ్చని జంటలు
చల్లని జీవితం ఇదే నవ భారతం
హోయ్ హోయ్ నా సామిరంగా 2

చరణం : బతకాలందరు దేశం కోసమే
దేశమంటేను మట్టి కాదోయి మనుష్యులే
స్వార్థము వంచన లేనిదే పుణ్యము
త్యాగమూ రాగమూ మిళితమే ధన్యమూ
హోయ్ హోయ్ నా సామిరంగా.



# తెలుగు వీర లేవరా

**అల్లూరి సీతారామరాజు)** **ఆదినారాయణరావు, ఘంటసాల**

ల్లవి : తెలుగువీర లేవరా దీక్షబూని సాగరా
దేశమాత స్వేచ్ఛకోరి తిరుగుబాటు చేయరా

రణం : దారుణ మారణ కాండకు తల్లడిల్ల వద్దురా
నీతి లేని శాసనాలు నేటి నుండి రద్దురా
నిదుర వద్దు బెదరవద్దు నింగి నీకు హద్దురా తెలుగు

రణం : ఎవడు వాడు ఎచటి వాడు యిటు వచ్చిన తెల్లవాడు
కండబలం కొండబలం కబళించే దుండగీడు
మానధనం ప్రాణధనం దోచుకునే దొంగవాడు
తగిన శాస్తి చెయ్యరా తరిమి తరిమి కొట్టరా తెలుగు

రణం : ఈ దేశం ఈ రాజ్యం నాదే అని చాటించి
ప్రతి మనిషీ తొడలగొట్టి శృంఖలాలు పగులగొట్టి
చుర కత్తులు పదును పట్టి తుది సమరం మొదలు పెట్టి
సింహాలై గర్జించాలీ సంహారం సాగించాలీ
వందే మాతరం వందేమాతరం తెలుగు

# భారతీయ వీరులం

భారతీయ వీరులం
భరతమాత బిడ్డలం
భారతీయ వీరులం
భరతమాత బిడ్డల-

మాతృదేశ గౌరవం
కాపాడే ధీరులం,
మాతృదేశ గౌరవం
కాపాడే ధీరులం,

శాంతి కోరు పాపలం
సమత పెంచు బాలలం ॥శాంతి।

మేము భావి పౌరులం,
త్యాగధనుల వారసులం, ॥మేము

వేషబాష లేవైనా
మతాచార మేదైనా ॥వేశబాష

మనం భారతీయులం

ఒకే తల్లి పిల్లలం

ప్రపంచాన మన దేశం

ప్రతిభను నిలబెట్టుదాం,

ప్రతిభను నిలబెట్టుదాం.

మనమంతా సైనికులం

మనం ప్రజా సేవకులం

హిమశైల కిరీటమై

సముద్ర పాద పీఠమై

గంగ, యమున, గోదావరి

కృష్ణవేణి సహితమై

విలసిల్లే భరతమాత

మన తల్లికి జోహార్,

మన తల్లికి జోహార్.

భారతీయ వీరులం,

భరత మాత బిడ్డలం ॥భారతీ॥

# నాదేశం భగవద్గీత

(బంగారు మనిషి) ఘంటసాల, సుశీల

అ : నా దేశం భగవద్గీత నా దేశం అగ్నిపునీత సీత
నా దేశం కరుణాంతరంగ నా దేశం సంస్కార గంగ
అది నాడు - మరి నేడు .....

ఇద్దరు : ఎక్కడ కెళుతుందీ దేశం ఏమై పోతూంది
హిమశైల శిఖరం పైకా ? పాతాళకుహరం లోకా ||ఎక్కడ||

ఆ : ప్రవచనాల పచ్చిక బయళ్ళలో పన్నాగాల గోతులు

అ : ప్రణాళికల గాదెల కింద దాక్కున్న పంది కొక్కులు

ఆ : పావురాళ్ళ ఈకలు తొడక్కుని ఊరేగే రాబందులు

అ : ఇంకా - పొద్దున చూరుకంటుకునే బల్లులై
మధ్యాహ్నం గోడమీద పిల్లులై సాయంత్రం
ఊసర వెల్లులై పార్టీల రంగులు ఫిరాయించే
అవకాశవాదులూ అటు రాబందులూ . . .

ఆ : ఇటు అవకాశవాదులూ . . . ||ఎక్కడ||

ఇద్దరు : ఉగ్గు పాలతో మత మౌఢ్యాలను రంగరించీ
కంచాలలో వర్ణ భేదాలు వడ్డించి

అ : జాతికి నల్ల మందెక్కించే మతోన్మాదులు ఒక వంక

ఆ : శాంతీ సహనం సౌహార్ద్రం చచ్చురకం సంస్కార మనీ

అ : వ్యక్తుల హత్యల తోనే నేటి వ్యవస్థ మారి తీరుతుందనీ
అరాచకంగా పరిక్రమించే మహూగ్రవాదులు ఒక వంక
మతోన్మాదులు ఒకవంక . . . .

ఆ : మహోగ్ర వాదులు ఒక వంక

అ : ధాన్యంలోనే కాదు, సౌజన్యంలోనూ కల్తీలు

ఆ : నేతిలోనే కాదు నీతిలోనూ కల్తీలు

అ : మైమరపించే మద్యంలో మనుషుల చంపే కల్తీలు

ఆ : ప్రాణం పోసే మందుల్లో ప్రాణం తీసే కల్తీలు

అ : పరీక్ష రాసే చేతుల్లో "కాపీ" కల్తీలు

ఆ : ఉప్పెనలాంటి యువతరంలో "హిప్పీ" కల్తీలు

అ : అటు దినుసులు కల్తీలు

ఆ : ఇటు మనసులు కల్తీలు

ఇద్దరు : ధరల బరువుతో ప్రజల రెక్కలు విరుగుతుంటే
తిండి కరువుతో పేదల డొక్కలు పండుతుంటే

అ : పరువుల్లకై కుమ్ములాటలు బిరుదుల్లకై పెనుగులాటలు

ఆ : బాషా దురహంకారాలూ ప్రాంతీయ హుంకారాలు

అ : దొంగ సరుకు రవాణాలూ నల్ల డబ్బు పి . . లు

ఆ : విలువ లేని నినాదాలూ

అ : పనికి రాని పట్టాలూ

ఆ : అడుగడుగున లంచాలూ

అ : పడగెత్తిన వంచనాలూ

ఆ : రాహువు పుట్టిందా ? జాతికి రక్తం చచ్చిందా ?

అ : ఇప్పటి కయినా ఈ దేశం తనతప్పు తెలుసుకోవాలి
రానున్న ముప్పు తెలుసుకోవాలి - కాకుంటే
ఈ దేశాన్నే కణ కణ మండే నిప్పులలో
కల్తీ లేని నిప్పులతో కడిగేస్తుంది మా తరం

అందరు : వందేమాతరం . . . వందేమాతరం . . . వందేమాతరం



# స్వాతంత్ర్యమే మా జన్మహక్కని

పల్లవి : స్వాతంత్ర్యమే మా జన్మహక్కని చాటండి 2

నిరంకుశము శక్తులయినా

నిర్భయముగా ఎదిరించండి

పరుల న్యాయమున బాధలు పొంది

బ్రతికిన చచ్చిన బేదము లేదు - పరుల ॥స్వాతంత్ర॥

చరణం : కవోష్ణ రుధీర జ్వాలలతోటి 2

స్వాతంత్ర సమరం నడపండి

ఎంత కాలమిటు సహించి యున్నా

దోపిడి మూకకు దయరాదన్నా ॥ఎంత స్వాతం॥

సంఘములలోను ఐక్యం లేదని

సలకలపడకు శాంతి పధాన

స్వర్గతుల్యమౌ స్వతంత్ర జ్యోతికి

మాంగల్యపు హారతులమ్మా ॥స్వాతంత్ర॥

# దేశమును ప్రేమించుమన్నా గీ||

**గురజాడ అప్పారావు**

దేశమును ప్రేమించుమన్నా!
మంచి యన్నది పెంచుమన్నా!
వట్టి మాటలు కట్టి పెట్టోయ్, సీ||
గట్టి మేల్ తల పెట్టవోయ్.

పాడి పంటలు పొంగి పొర్లే
దారిలో నువు పాటు పడవోయ్,
తిండి కలిగితె కండ కలదోయ్,
కండ కలవాడేను మనిషోయ్.

పూను స్పర్థను విద్యలందే,
వైరములు వాణిజ్య మందే,
వ్యర్థ కలహము పెంచబోకోయ్, గీ||
కత్తి వైరము కాల్చవోయ్.

దేశాభిమానం నాకు కద్దని
వట్టి గొప్పలు చెప్పుకోకోయ్
పూని యేదైనాను ఒక మేల్
కూర్చి జనులకు చూపవోయ్.

సొంత లాభం కొంతమనకు
పొరుగు వాడకి తోడపడవోయ్,
దేశమంటే మట్టి కాదోయ్,
దేశమంటే మనుషులోయ్.

దేశమని యొడి దొడ్డ వృక్షం
ప్రేమలను పూలెత్త వలెనోయ్,
నరుల చెమటను తడిసి మూలం
ధనం పంటలు పండవలెనోయ్

ఆకులందున అణగి మణగీ
కవిత కోయిల పలక వలెనోయ్,
పలుకులను విని దేశమందభి
మానములు మొలకెత్తవలెనోయ్.



# పసిడి పాపల చాచాజీ

పసిడి పాపల చాచాజీ
పుట్టిన రోజు ఈ రోజు !
పిల్లల పండుగ ఈనాడు
ఎల్లరు మరువరు ఏనాడు !!

తన ఎదపై చాచాజీ
ఎర్ర గులాబీ నిలిపాడు !
పిల్లల సుందర వదనాలే
చల్లని మదిలో నింపాడు !!

దేశం కోసం వెలిశాడు
దేశ ప్రగతి సాధించాడు !
శాంతి కపోతం ఎగరేసి
విశ్వ శాంతినే చాటాడు !!

మల్లె మనసుల పిల్లల్లో
చల్లని ప్రేమను నింపాడు !
బాలల హృదిలో నిలిచాడు
భారత నేతగ వెలిగాడు !!

# ఏ దేశమేగినా

శ్రీ రాయప్రోలు సుబ్బారావు

ఏ దేశ మేగినా ఎందుకాలిడినా
ఏ పీఠ మెక్కినా ఎవ్వరేమనినా
పొగడరా నీ తల్లి భూమి భారతిని
నిలుపరా నీ జాతి నిండు గౌరవము.

ఏ పూర్వ పుణ్యమే ఏ యోగ బలమో
జనియించినాడ వీ స్వర్గ ఖండమున
ఏ మంచి పూవులన్ ప్రేమించినావో
నిను మోచె ఈ తల్లి కనక గర్భమున.

లేదురా ఇటువంటి భూదేవి యెందు
లేరురా మన వంటి పౌరులింకెందు
సూర్యుని వెలుతురుల్ సోకునందాక
ఓడల జెండాలు ఆడునందాక.

అందాక గల యీ అనంత భూస్థలిని
మన భూమి వంటి చల్లని తల్లి లేదు.
పాడరా నీ తెన్గు బాలగీతములు
పాడరా నీ వీర భావ భారతము.

# విశాల భారత దేశం

డా. దాశరధి

విశాల భారత దేశం మనది,
హిమాలయాలకు నిలయమిది,
ఇలాంటి దేశంలో ప్రజలంతా
విశాల హృదయంతో మెలగాలి ॥విశాల॥

మతాలు వేరయితేనేమి
బాషలు వేరయితేనేమి
భారతీయులం అందరం
భారతదేశం సుందరం ॥విశాల॥

ద్వేషం, రోషం తొలగాలి
ప్రేమ, స్నేహం వెలగాలి
బుద్ద గాంధీల బోధనలే
తొలగించును మన వేదనలే ॥విశాల॥

ప్రేమ పతాకం చేబూని
ఐక్య పథంపై పయనిద్దాం
త్యాగశక్తి మన మహాయుధంగా
దేశ శత్రువుల నెదిరిద్దాం. ॥విశాల॥

కూలీ, రైతూ, మేధావీ
చేయీ, చేయీ కలపాలీ
పల్లె పట్నం ఏకంగా
ప్రగతి పథంపై కదలాలి. ||విశాల||

అనారోగ్యమూ, అవిద్యనూ
అసమానతనూ తొలగించాలి.
ప్రజాస్వామ్యమును కాపాడాలి
సామ్యవాదమును సాధించాలి. ||విశాల||



# జయ జయ జయ

శ్రీ దేవులపల్లి వెంకటకృష్ణ శాస్త్రి

జయ జయ జయ ప్రియ భారత
జనయిత్రీ దివ్యధాత్రి !
జయ జయ జయ శత సహస్ర
నరనారీ హృదయనేత్రి

జయ జయ సస్యామల సు
శ్యామ చల చ్చేలాంచల !

జయ వసంత కుసుమలతా
చలిత లలిత చూర్ణకుంతల !
జయ మదీయ హృదయాశయ
లాక్షారుణ పదయుగళా ! ॥జయ జయ॥

జయ దిశాంత గత శకుంత
దివ్యగాన పరితోషణ !
జయ గాయక, వైతాళిక
గళ విశాల పద విహరణ !
జయ మదీయ మధుర గేయ
చుంబిత సుందర చరణా ! ॥జయ జయ॥

# పాడవోయి భారతీయుడా

పల్లవి : పాడవోయి భారతీయుడా
ఆడి పాడవోయి విజయగీతికా
నేడే స్వాతంత్ర్య దినం - వీరుల త్యాగఫలం 2
నేడే నవోదయం - నేడే ఆనందం.

చరణం : స్వాతంత్రం వచ్చెనని సభలే చేసి
సంబర పడగానే సరిపోదోయ్
సాధించిన దానికి సంతృప్తిని చెంది
అదే విజయ మనకుంటే పొరపాటోయి
ఆగవోయి భారతీయుడా
కదలి సాగవోయి ప్రగతి దారులా ||

చరణం : ఆకాశం అందుకునే ధరలొకవైపు ||ఆకా
అదుపు లేని నిరుద్యోగుల మింకొక వైపు
అవినీతి బంధుప్రీతి చీకటి బజారు
అలుము కొన్న నీ దేశం ఎటు దిగజారు
కాంచవోయి నేటి దుస్థితి
ఎదిరించవోయి ఈ పరిస్థితి ||కాంచ||

చరణం : పదవీ వ్యామోహాలు, కులమత బేధాలు

బాషా ద్వేశాలూ చెలరేగే నేడు

ప్రతి మనిషి మరి యొకనీ దోచుకొనేవాడే

స్వార్ధమే అనర్థ కారణం

అది చంపుకొనుటే క్షేమదాయకం ||పాడ||

నవ సమాజ నిర్మాణమే నీ ధ్యేయం

సకల జనుల సౌభాగ్యమే నీలక్ష్యం

ఏక దీక్షతో గమ్యం చేరిన వాడే

లోకానికి మన భారత దేశం

అందించునులే శుభ సందేశం

పాడవోయి భారతీయుడా !!



# శుభాకాంక్ష

ఉ॥ భారత మాత గర్భమున భారత వీర గుణాఢ్యులెందరో
ధీర పరాక్రమంబు గల ధైర్యకిశోరులు బుట్టినారిలన్
భారత దేశ సంపదకు బాటలు వేసిన ధన్యవంతులన్
కోరి భజించి వారికిట కోటి ప్రణామము లంటి నేనికన్ ॥

ఉ॥ సుందరమైన దేశమిది చూడగ చక్కని పుణ్యక్షేత్రముల్
అందము చిందు సుందర పురాలయ మందలి చిత్రభంగిమల్
ఎందున గాంచలేదు మరి ఎంత ప్రవీణులో శిల్పులందరన్
వందనమంటి వారికి నవారిత జీవుల నంచు నెంచితిన్ ॥

సీ॥ అలనాడు మనదేశ మాంగ్లేయులేలగ
తల్లి భారత మాత తల్లడిల్లె
కన్న తల్లిగ గార్చు కన్నీరు జూసివా
రెంద రెందరో వీరు లేకమైరి
తెల్ల దొరల నెల్ల తెగగొట్టి వేసిన
స్వాతంత్ర్య వీరుల స్మరణజేసి
పూజింప వలెను యీ పుణ్య ధర్మాత్ముల
బాలులార భరత పౌరులార ॥

అమర వీరాధి వీరుల నాత్మయందు
స్మరణ జేయంగ రారండి సంతసమున
దేశ భక్తుల ఆశయా దేశములను
అను సరించియు మెదలుడీ యవని యందు ॥

భరత దేశము ధైర్యబల పరాక్రమ ధన్య
పుణ్యాత్ములను గన్న పుడమి మనది
గల గలా పారేటి గంగా తరంగాలు
పొంగి పారుచునుండ భూమి మనది ॥
సంగీత నాట్యాల సాహిత్య కళలకు
పుట్టిన యిల్లయిన పృధ్వి మనది
వీరనారుల గొప్ప శూరనేతల పుణ్య
ధర్మాత్ములను గన్న ధరణి మనది ॥

భాగ్య మూర్తిగ మా తల్లి భరత మాత
కరుణ గాంచవె మా యమ్మ కల్పవల్లీ
వరములీయవె ఇక మాదు వాంఛదీర
ప్రణుతి జేసెద నీ దివ్య పాదములకు ॥

# వందనం వందనం వందనం

ఆర్. వీరాచార్యులు

వందనం వందనం వందనం
భరత మాత పాదాలకు పుష్పాభి వందనం ॥వందనం॥

అందమైన భరతదేశ మంధు జనన మందిన
ఎందరో మహా వీరులందరికి వందనం
కాళిదాస తిక్కనార్య కవివరోత్తముల గన్న
బాలా త్రిపుర సుందరి భాషామ తల్లికి ॥వందనం॥

స్వాతంత్ర్య సమరోధ్యమ సారధులై నిలిచియూ
స్వాతంత్ర్యం, సాధించిన సామ్రాజ్య నేతలకు ॥వందనం॥

కుటిల బ్రిటీషు పాలనమే కూాలదన్ని వేయుటకు
పాటుబడ్డ వీరులకు పాదాభి వందనం ॥వందనం॥

సుమధురమౌ దేశానికి సువర్ణాలు దిద్దిన
అమర వీరులందరికి ఆత్మాభి వందనం ॥వందనం॥

ధైర్యంతో ముందు నడిచి ధర్మయుద్ధమందు నిలిచి
వీర స్వర మేగిన వీరనారులందరికి ॥వందనం॥

# జేజేలమ్మా జేజేలు

ఆర్. వీరాచార్యులు

జేజేలమ్మా జేజేలు జననీ భారతికి జేజేలు
జగన్ మాతకు జేజేలు ॥జేజేలమ్మా॥

స్వాతంత్రోద్యమ రథసారదులకు జేజేలమ్మా జేజేలు
దేశోద్ధారక అమర వీరులకు ధన్యమూర్తులకు జేజేలు ॥జేజే॥

పట్టాభి సీతా రామయ్య గారికి జేజేలమ్మా జేజేలు
ఆంధ్రకేసరి టంగుటూరి మన అంబేద్కర్‌కు జేజేలు ॥జేజే॥

సుభాష్ చంద్రబోస్ వీరునకు జేజేలమ్మా జేజేలు
దేశం కోసం ప్రాణములిడిన దర్మమూర్తులకు జేజేలు ॥జేజే॥

స్వతంత్ర భారత సమర వీరులకు జేజేలమ్మా జేజేలు
జాతి పిత మన మహాత్మ గాంధీ జవహార్ నెహ్రూకు జేజేలు ।జేజే।

సర్దార్ వల్లభాయి పటేలుకు జేజేలమ్మా జేజేలు
అహింస మూర్తి పొట్టి శ్రీరాములు అమరజీవికి జేజేలు ।జేజే।

కాశీనాధ నాగేశ్వర రావుకు జేజేలమ్మా జేజేలు
కందుకూరి విరేశలింగం కరుణామయులకు జేజేలు ॥జేజే॥

ముచ్చటైన మువ్వన్నెల జెండకు జేజేలమ్మా జేజేలు
స్వరాజ్యాన్ని సాధించి తెచ్చిన సాహస వీరులకు జేజేలు ॥జేజే॥

ధర్మ మూర్తులకు కర్మ వీరులకు జేజేలమ్మా జేజేలు
బానిసత్వమును పారతోలిన భరత వీరులకు జేజేలు ॥జేజే॥

# వచ్చిందోయ్ వచ్చింది

ఆర్. వీరాచార్యులు

1. వచ్చిందోయ్ వచ్చింది స్వాతంత్ర్యమే మనకొచ్చింది
స్వరాజ్యమే మన కొచ్చింది ॥వచ్చిందోయ్॥

ఎందరెందరో మహానుభావులు ఎదురు నిలువగా బంధూకులకు
॥2॥పంతొమ్మిది వందల నలబై ఏడు పదహేను ఆగస్టు రోజున
॥వచ్చిందోయ్॥

2. ఎగిరిందోయ్ ఎగిరింది, ఎర్రకోటపై త్రివర్ణ జెండా ॥2॥
దగా కోరులను తరిమి కొట్టుటకు ధైర్యవంతులై నాయకు
లెందరో ! తెగించి ముందుకు నడిచారు ఆ తెల్ల దొరల
నెదిరించారు. ॥వచ్చిందోయ్॥

3. పోయిందోయ్ పోయింది భారతీయులకు బానిసత్వమే ॥2॥
బాయి బాయిగా కలిసి మెలసి చేయి చేయి కలపండి
న్యాయం కోసం ముందుక నడిచి నవచైతన్యం తేవండి
॥వచ్చిందోయ్॥

4. మానండోయ్ మానండి కులమత భేదం మానండి ॥2॥
మనుషులందరు ఒక్కటేనని మానవత్వం పెంచుకొండిక

వినోదంబుగా విలాసాలతో విశ్వ భారతిని పొగడండి

॥వచ్చిందోయ్॥

5. కదలండోయ్ కదలండి కార్మిక కర్షకులందరేకమై ॥2॥

వదులు కొండిక నీది నాదియనే వాదులాట లికపైనుండి

అధర్మాలను అణిచి వేయగ అన్ని జాతులొక టవ్వాలి

॥వచ్చిందోయ్॥

6. లేవండోయ్ లేవండి అధర్మాలను అణచివేయగ ॥2॥

నవ భారత యువ నాయకులందరు నవచైతన్యపు రధమును

లాగుచు భావి పౌరులై భారతదేశపు ప్రఖ్యాతిని గొనియాడండి

॥వచ్చిందోయ్॥



# దండాలు దండాలు దండాలమ్మా

ఆర్. వీరాచార్యులు

1. దండాలు దండాలు దండాలమ్మా !!మన!! తల్లీ భరత మాతకు దండాలమ్మా !!దండాలు!!

2. భరత జాతి రత్నాలకు దండాలమ్మా !!మన!! బాపూజీ నెహ్రూలకు దండాలమ్మా !!దండాలు!!

3. సాహస వీరులకు దండాలమ్మా !!మన!! సామ్రాజ్య నేతలకు దండాలమ్మా !!దండాలు!!

4. దేశ ప్రగతి కోసమే దండాలమ్మా !!మన!! దేశోద్ధారకులకే దండాలమ్మా !!దండాలు!!

5. నిస్వార్థ పరులకు దండాలమ్మా !!మన!! నిష్కలంక వీరులకు దండాలమ్మా !!దండాలు!!

6. విజయ కేతనానికే దండాలమ్మా !!మన!! మన వీరనారులందరికీ దండాలమ్మా !!దండాలు!!

7. మహావీర యోధులకు దండాలమ్మా !!మన!! మహా జన్మ భూమికి దండాలమ్మా !!దండాలు!!

8. తెల్ల దొరల తరిమి కొట్టె దండాలమ్మా !!మన!! తెలుగు
బిడ్డలందరికి దండాలమ్మా !!దండాలు!!

9. సమర యోధులందరికి దండాలమ్మా !!మన!! స్వాతంత్ర
వీరులకు దండాలమ్మా !!దండాలు!!

10. ముద్ద మందారల దండాలమ్మా !!మన!! మువ్వన్నెల
జెండాకు దండాలమ్మా !!దండాలు!!

11. అగ్రగణ్యులందరికి జోహార్లమ్మా !!మన!!
అమర వీరులందరికి జోహార్లమ్మా !!దండాలు!!



# భారతీ మాయమ్మ

ఆర్. వీరాచార్యులు

1. భారతీ మాయమ్మ బంగారు తల్లీ
కరుణించ రావమ్మ ఓ కల్పవల్లీ
మరు మల్లె దండలా మాలలే అల్లీ
విరజాజి చామంతి విరుల నెగజల్లీ ॥భారతీ॥

2. ప్రేమ దీరగ నిన్ను పూజింతుమమ్మా
అమర వీరుల గన్న అన్నపూర్ణమ్మా
ప్రమదంబు లొలుకగా ప్రార్థింతుమమ్మా
కామితార్థము లిచ్చి కరుణించవమ్మా ॥భారతీ

3. గంగ సింధూనది కావేరి పెన్నా
తుంగ భద్రా పుణ్య గోదావరి కృష్ణ
పొంగి పారలే నమ్మ నీ పుడమిలోన
బంగారు పంటలు బాగ్యంబు లొలుక ॥భార

4. కాళిదాసాదులౌ కవివరోత్తముల
బాల గంగాధర బాపూజీ నెహ్రూ

లాల్ బాహద్దూరు ఝాన్సీలక్ష్మీ రుద్రమ్మ
బల వీరులను గన్న భాగ్య దేవతవే ॥భారతీ॥

5. వన్య భూములు యెన్నో వసుధలో వెలసె
అన్యోన్యమైనట్టి అమరావతి స్థాప
పుణ్యక్షేత్రములెన్నో పునితమైనవిగా
ధన్యమాత మమ్ము దయ గాంచవమ్మా ॥భారతీ॥

6. అంబ ఓ జగదంబ అంబ మాయమ్మా
సంబరమ్ముగ నిన్ను స్మరియింతు మమ్మా
కంబు కంఠి మమ్ము కరుణించవమ్మా
అంబ భారతి మమ్ము ఆదుకోవమ్మా। ॥భారతీ॥



# విశ్వభారతి

ఆర్. వీరాచార్యులు

విశ్వభారతీ !!సు!! విశాల భారతీ !!విశ్వసుందరిద్గైకొను
విజయ మంగళారతీ !!విశ్వ!!

1. నీవే సర్వస్వమికా ! నీవే దైవము మాకు
దీవెనలందించుమా దీనుల దరి జేర్చుమ్మా ॥విశ్వ॥

2. బాల త్రిపుర సుందరి నీ లాలనలో పెరిగినాము
జాలిగను బాలలము జగజ్జనని మా యమ్మా ॥విశ్వ

3. గంగ కృష్ణ గోదావరి పొంగి పొరలె నీ పుడమిలో
బంగారు పంటలిచ్చె భాగ్యదాత మాయమ్మా ॥విశ్వ॥

4. కాళిదాస తిక్కనార్య కవి వరోత్తములగన్న ॥
నీలవేణి నీ పదాలె నిత్యము సేవింతుమమ్మా ॥విశ్వ॥

5. వీర నారులెందరినో వీర కిశోరులగన్నా ! పరమ
పూజ్యురాల మా ప్రార్థన లాలించమ్మా ॥విశ్వ॥

6. కరుణామయి మా పాలిట కల్పతరువు నీవేగా !
వరదాయిని మొరగాంచి వరములీయ రావమ్మా ॥విశ్వ॥

# అంబా భారత మాత

ఆర్. వీరాచార్యులు

పల్లవి : అంబా భారత మాతా నీకు జోహారు తల్లీ నమో భారతా ॥2॥

1. గంగా కృష్ణ గోదా ! తుంగభద్ర పెన్నా ! బంగారు సీమలో
భాగ్యమొల్క యెన్నెన్నొ నదులు ఉప్పొంగె చల్ల ॥అంబా॥

2. పాలన జేయమ్మా ! ప్రార్థింతూ మాయమ్మా ॥2॥
కాళిదాస వరకవుల గన్న ఓ కల్పవల్లి మా కన్న తల్లి ॥అంబా॥

3. నిన్నే ఆత్మలోనా ! సన్నూతింతు మమ్మా ॥2॥ అన్నపూర్ణ
ఓ అజుని రాణి యీ చిన్ని బాలలను ఆదరించు ॥అంబా॥

4. బంగారు పంటాల భాగ్యంబు లీయమ్మా ॥2॥ శృంగార డిమ్మి
సంగీత వీణానాధంబులోన మోదంబు గొల్తు ॥అంబా॥

5. బంబార వేణివే మా బాధాలీడేర్చా ॥2॥ సంబరంబు
నీ స్మరణ జేతు నీ చక్కనైన పదములకు మ్రొక్కి ॥అంబా॥

6. కాపాడు మాయమ్మా కరుణించ రావమ్మా ॥2॥
పాపకర్మముల బాపవమ్మ నీ పాద సేవ కంకితమ్మైన ॥అంబా॥

7. మ్రొక్కెదాను మాయమ్మా ! మోక్షంబూ లీయమ్మా ॥2॥
చక్కని తేనెల పల్కులొల్క నీ చల్లని దీవెన లివ్వవమ్మాఅంబా

# కలసి పాడుదాం

-శ్రీశ్రీ

కలసి పాడుదాం తెలుగ పాట
కదలి సాగుదాం వెలుగు బాట
తెలుగు వారు నవజీవన నిర్మాతలనీ
తెలుగు జాతి సకలావనికే జ్యోతియని ॥కలసి॥

కార్యశూరుడు వీరేశలింగం
కలం పట్టి పోరాడిన సింగం
దురాచారాల దురాగతాలను
తుద ముట్టించిన అగ్ని తరంగం
అడుగో అతడే వీరేశలింగం . . . . .

మగవాడెంతటి ముసలాడైనా
మళ్ళీ పెళ్ళికి అర్హత వుంటే
బ్రతుకే తెలియని బాల వితంతువు
కెందుకు లేదా హక్కంటాను . . . . .

చేతికి గాజులు తొడిగాడు
చెదిరిన తిలకం దిద్దాడు
మోడు వారిన ఆడ బ్రతుకుల
పసుపు కుంకుమ నిలిపాడు . . . . . ॥కలసి॥

అడుగో అతడే గురజాడ
మంచి చెడ్డలు లోకమందున
ఎంచి చూడగ రెండె కులములు
మంచియన్నది మాలయైతే
మాల నేనౌతాను అన్నాడు . . . . . ॥కలసి॥

# మాది స్వతంత్ర దేశం

మాది స్వతంద్ర దేశం
మాది స్వతంత్ర జాతి
భారతదేశమే మాదేశం
భారతీయులు మాప్రజలు 2 ॥మాది॥

వింధ్య హిమామవత్ శ్రీ నీలాద్రుల
సంధ్యారుహిత నవాశలు మావి
గంగా గోదావరి సహ్యాజా
తుంగ తరంగిత హృదయాల్ మావి - 2 ॥మాది॥

ఆలయమ్ముల శిల్పవికాసం
ఆరామమ్ముల కళా ప్రకాశం
మొగల్ సమాధుల రస దరహాసం
మాకు నిత్యనేతి హాసం ॥మాది॥

అహింసా పరమోధర్మ
సత్యంవద ధర్మంచర - 2
ఆది రుషుల వేదవాక్కులు
మా గాంధీ గీతముల సువాక్కులు ॥మాది॥

స్వతంత్రతా భ్రాతృత్వాలు
సమతా మాసదాశయులు
జననీ ఓ స్వతంత్రదేవీకొనుమా నివాళులు మావీ ॥మాది॥

# త్రిలింగ దేశం

త్రిలింగదేశం మనదేనోయ్, తెలుంగులంటే మనమేనోయ్
మధురం మధురం మధురం ఆంధ్రమ్మంటే అతిమధురం
దేశభాషలా తీరుల్లోకీ, ఆంధ్రమ్మంటే అతిమధురం
రాయలు మనవాడోయ్ - పండితరాయలు, మనవాడోయ్

కలం తిక్కనా, ఖడ్గతిక్కనా, గణపతిదేవులు మనవారోయ్ ॥
అమరావతి, నాగార్జున కొండ, సిద్ధహస్తుల శిల్పాలోయ్ ॥
మల్లినాథ కుమారిభట్టులు, అందెవేసినా హస్తాలోయ్ ॥

గోదావరి కృష్ణా, తుంగభద్ర పెన్నా
కనిపెంచినవోయ్ తెలుగుజాతిని, వినిపించినవోయ్ వీణానాదం ॥

ఓడలు కట్టామూ మింటికి, మేడలు కట్టామూ
మున్నీరంతా ఏకరాశిగా ముద్దరవేశామూ ॥

సంతలో వజ్రాల రాసులూ, జల జలలాడినవీ
కుబేర తుల్యం మహదైశ్వర్యం గొడుగుపట్టినాదీ ॥

కలకలలాడే తెలుగదేవికి గంధాగరు ధూపం
కిలకిలలాడే తెలుంగు కన్నెల కిన్నెర లాలాపం
బలం గడించీ - వెలుంగునించె, తెలుంగుజెండా "హుం"
తెలుగుభేరి "ధాం"

గణగణ గణగణ గణగణ గణగణ తెలుగు జయగంటా
గణగణా గణాగణ, గణాగణాగణ, తెలుగు జయగంటా ॥త్రిలింగ॥

# పండిత నెహ్రూ పుట్టినరోజు

పండిత నెహ్రూ పుట్టిన రోజు
పాపలందరికి పండగ రోజు
సమతా మమతా పుట్టిన రోజు
మంచికి కోవెల కట్టిన రోజు

ముత్యంలాంటి మోతీలాలుకు రత్నంలా జన్మించాడు
జాతిరత్నమై వెలిగి ఇంకొక జాతి రత్నమును కన్నాడు
అతడే జవహరులాలు అతనికి మన జేజేలు- 2 ॥పండిత॥

తలపై తెల్లని టోపి ఎదపై ఎర్రగులాభి - 2
పెదవులపై చిరునవ్వు మదిలో పున్నమిపువ్వు
చేతిలో పావురం మనజాతికి అతడే గోపురం- 2 ॥పండిత॥

మహాత్మగాంధీ అడుగుజాడలో స్వరాజ్య సమరం నడిపాడు
రణ దాహంతో రగిలే జగతిని శాంతి సుధలు కురిపించాడు
కన్నుమూసినా జవహర్‌లాల్ కంటిపాపగా వున్నాడు
ఇంటింట జ్యోతిగా వున్నాడు చాచానెహ్రూ అమర్‌రహే- 3

॥పండిత॥

# బలే తాత మన బాపూజీ

బలెతాత మన బాపూజీ బాలలతాత బాపూజీ-2
బోసినవ్వుల బాపూజీ చిన్ని పిలకా బాపూజీ ॥బలే॥

కులమత బేధం వలదన్నాడు కలిసి బతికితే బలమన్నాడు
మానవులంతా ఒకటన్నాడు మనలో జీవం పోశాడు ॥బలే॥

నడుం బిగించి లేచాడు అడుగు ముందుకు వేశాడు
కదంతొక్కుతూ కదిలాడు దేశం దేశం కదిలింది
గజగజలాడెను సామ్రాజ్యం మనకు లభించెను స్వరాజ్యం ॥బలే॥

సత్యహింసలె శాంతిమార్గమని జగతికి జ్యోతిని చూపించాడు
మానవధర్మం బోదించాడు-2 మహాత్ముడై ఇలవెలిశాడు ॥బలే॥



# చెయ్యెత్తి జై కొట్టు తెలుగోడా !

వేములపల్లి శ్రీకృష్ణ

చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా !
గతమెంతో ఘనకీర్తి గలవోడా !
సాటిలేనీ జాతి - ఓటమెరగని కోట
నివురుగప్పి నేడు - నిదుర పోతుండాది.

జై కొట్టి మేల్కొలుపు తెలుగోడా !
గత మెంతో ఘనకీర్తి గలవోడా !

వీర రక్తపుధార - దార బోసిన సీమ
పలనాడు నీదెరా - వెలనాడు నీదెరా
బాల చంద్రుడు చూడ ఎవరోడోయి !
తాండ్ర పాపాయగూడ నీవోడూ !

రాణీ రుద్రమదేవి, మల్లమాంబా, మొల్ల
మగువ మాంచాల నీ తోడబుట్టిన వాళ్ళే
వీర వనితల గన్న తల్లేరా
ధీరమాతల జన్మ భూమేరా

నాగార్జునిడి కొండ - అమరావతీ స్తూప
భావాల పుట్టలో - జీవకళ పొదిగావు
అల్పుడను కానంచు తెలిపావూ
శిల్పి నంటిని దేశ దేశాల

దేశమంటే వట్టి మట్టి కాదన్నాడు
మనుషులన్నా మాట మరువబోకన్నాడు
అమరకవి గురజాడ నీవోడూ -
ప్రజల కవి తను పాడి చూపాడోయ్ !

రాయలేలిన సీమ - రతనాల సీమరా
దాయి గట్టి పరులు - దారి తీస్తుండారు
నోరెత్తి యడగరా దానోడా
వారసుడ నీవేరా తెలుగోడా !

కల్లోల గౌతమీ - వెల్లువల కృష్ణమ్మ
తుంగ భద్రాతల్లి - పొంగి పొరలిన చాలు
ధాన్యరాసులె పండు దేశాన
కూడుగుడ్డకు కొదవ లేదోయ్ !

మూడుకోట్ల బలగమోయ్ - ఒక్కటై మనముంటే
యిరుగు పొరుగుతోన - వూరు పేరుంటాది
తల్లి ఒక్కటె నీకు తెలుగోడా
సవతి బిడ్డల పోరు మనకేలా

పెనుగాలి వీచింది - అణగారి పోయింది
నట్టనడి సంద్రాన - నావ నిలుచుండాది
చుక్కాని బట్టరా తెలుగోడా
నావ దారిజేర్చరా మొనగాడా

# నేనూ నా దేశం

నేనూ నా దేశం పవిత్ర భారతదేశం
అశోకుడేలిన ధర్మప్రదేశం బుద్ధుడు వెలసిన శాంతి దేశం
బుద్ధం శరణం గచ్ఛామి ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి

కులమత భేదం మాపిన త్యాగి అమర బాపూజీ వెలసిన దేశం
వందే మాతరం - 3 ॥కుల॥నేనూ॥
కదం త్రొక్కిన వీరశివాజీ-2 వీరవిహారిణి ఝాన్సీరాణి-2
స్వరాజ్య సమరుడు అల నేతాజీ ॥జైహి

కట్ట బ్రహ్మన్న పుట్టిన దేశంనేనూ ॥నేనూ॥
అజాద్ గోఖలే వల్లబాయి పటేలు లజపతి తిలక్ నౌరోజీలు- 2
అంబులు కురిపిన మన అల్లూరి భగత్ రక్తము చిందిన దేశం
హిందుస్థాన్ హమారా హై ॥నే

గుండ్ల తుపాకి చూపిన దొరలకు గుండె చూపె మన ఆంధ్రకేస
శాంతి దూత మన జవహర్ నెహ్రూ- 3 ॥

లాల్ బహదూర్ జన్మించిన దేశం, జై జవాన్ జై కిసాన్- 3
అదుగో స్వరాజ్య రథసారధి-2 ఆదర్శనారి ఇందిరాగాంధి
గరీబీ హటావో- 3

ఆదర్శనారి ఇందిరాగాంధి అడుగుజాడలో పయనిద్దాం
అఖండ విజయం సాధిద్దాం అ, అఖండ

సాటిలేనిది దీటురానిది శాంతికి నిలయం మన దేశం నేనూ నా

# రివ్వు రివ్వున ఎగిరే

రివ్వు రివ్వున ఎగిరే - మన
రంగు రంగుల జెండా - మన
మూడు రంగుల జెండా - ॥రివ్వు॥

జాతీయ జెండా ఆకాశం నిండా
ఎగుర వేయ రండిరా
రండీ . . . ఓ బాలల్లార ! రండీ !
జెండా ఎగుర వేయ రండీ !
మన జెండా ఎగుర వేయ రండీ !

కాశాయపు రంగంటే త్యాగానికి గుర్తురా !
అచ్చమైన తెలుపు రంగు విశ్వశాంతి కీర్తిరా !
ఆకుపచ్చ రంగంటే పాడిపంట గుర్తురా !
బాలల్లారా, పౌరుల్లారా రండీ రారండీ !
మువ్వన్నెల జెండా ఎగుర వేయ రండీ !

# స్వాతంత్ర్యం రాలేదని

పల్లవి : స్వాతంత్ర్యం రాలెదని చెప్పిందెవరురా
సూర్యోదయం చూడలేదని గుడ్లగూబరా
స్వరాజ్యంలో కన్నీళ్ళకు కారణం ఎవరురా
ధనార్జనే ధ్యేయమైన రాజకీయ రాబందులురా
జెండా ఊంచారహే హమారా విజయీ విశ్వతిరంగ ప్యారా 2
పుట్టి పెరిగిన దేశం కోసం ప్రాణం ఇచ్చిన వారిగుండెల 2
ఈ జెండా ఈ జెండా ఇది భరత జాతి మెడలోని దండరా

॥జెండా॥

1. ఉరితాడుని ముద్దాడిన భగత్ సింగ్ కన్నుల్లో
తూటాలకి తెగిపడిన రామరాజు గుండెలో
ఆజాదు సుఖదేవ్‌రాజగురువు వూపిరితో
జలియన్ వాలాబాగ్‌లు ప్రవహించిన రక్తంలో
పుష్పించిన మందారం ఈ జెండా వర్షించిన మకరందం ఈ

॥ఈజెండా 2॥

మనలాగే వాళ్ళుకూడా చదువు సంధ్య లెక్కవంటే
వాళ్ళుకూడా మనలాగే కొలువేదో చేసుకుంటే
చావంటే భయమంటే చావచచ్చి బ్రతికుంటే
ఢిల్లీ నేలే దొరగారి కాళ్ళాకాడ పడివుంటే
బానిసలై బతికెవాళ్ళము తెల్లోడి
గాను గెద్దులయ్యే వాళ్ళము 2 ॥జెండా॥

2. భరతమాత పేరు వింటే ఒళ్ళు పులకరించకుండా

ఎవరు ఆమె ఎవరెయ్యా ఎవరి భార్య అనేవాళ్ళు

ఆగస్టు 15కు సెలవెందుకు వచ్చిందో

అర్ధంకానట్టివాళ్ళు నేటి తరం కుర్రవాళ్ళు

ఎంత కర్మ పట్టినాదిరా ఈ జాతిని ఎవరు నిదురలేపుతాడురా2

రెడ్డి వుండే రాజువుండే కమ్మవుండే కాపువుండే

ఆంధ్రుడన్న వాడు లేకపోయెరా

హిందువుండే ముస్లిముండే క్రైస్తవుడు సిక్కువుండే

భారతీయుడన్న వాడు కానరాక పోయెరా

త్యాగాలు వృదా ఆయెరా మృత వీరుల

కన్న కలలు కల్లలాయెరా ॥త్యాగాలు జెండా॥



# భారత దేశం మన దేశం

జి. వెంకటస్వామి

భారత దేశం మనదేశం
భారతీయులం మనమంతా
దేశ సేవే మన కర్తవ్యం
భరత మాతే మన సర్వస్వం

మమతా సమతలు
మానవ విలువలు
మన నడతలతో చూపిస్తే
మన దేశం ప్రగతి పథంలో
ముమ్ముందుకు పోతుంది
మురిపాలను అందిస్తుంది.

జాతి ప్రగతికి రూపునిచ్చే
జగతి జనులకు శాంతినిచ్చే
మార్గ దర్శక మైన దేశం
మరులు గొలిపే స్వర్గం
ఇదే మన భారత దేశం

దేశ ప్రజలను సేవిద్దాం
దేశ మాతను పూజిద్దాం
దేశ దేశాల మన పేరు
స్థిరంగా నిలుపుదాం ॥భారత॥

# భరత మాత బిడ్డలం

భరత మాత బిడ్డలం,

భవ్య చరిత వారసులం

అందరమూ ఒకటేనని ఆడి పాడుదాం - మన

మందరమూ ఒకటేనని కలిసి పాడుదాం ||భర||

ఒకే జాతి, ఒకే నీతి,

ఒకే ఒక్క పతాకం

అంతులేని అవకాశా

లందరికీ సమానం ||భరత||

మాతృదేశ గౌరవాన్ని

కాపాడే వీరులం

ప్రపంచాన మన దేశపు

ప్రతిభ చాటి చెప్పుదాం

అందరమూ ఒకటేనని ఆడి పాడుదాం - మన

మందరమూ ఒకటేనని కలిసి పాడుదాం.

## భారత జాతి పితా

భారత జాతి పితా !

గాంధీతాతా జేజేలు !

శాంతి దూతగా నిలిచిన

నెహ్రూ చాచా జేజేలు !

భారత రాజ్యాంగ నిర్మాతా !

బాబా అంబేద్కర్ జేజేలు !

వీరులందరికి దారి చూపిన

నేతాజీకి జేజేలు !

దురాచారములు రూపు మాపిన

కందుకూరికీ జేజేలు !

స్వతంత్ర యోధుడు సాహస జీవి

టంగుటూరికీ జేజేలు !

# రింగు రింగుల సాగిపో

రింగు రింగుల సాగిపో రంగు రంగుల జండా
ఓ రంగు రంగుల జండా 2

జాతీయ జండరా ఎగుర వేద్దాం రండిరా 2
రండీ ఓ యువకులార జండా ఎగుర వేద్దాం
మన జండా ఎగుర వేద్దాం 2

ఆకు పచ్చ రంగురా పాడి పంటల గుర్తురా 2
రండీ ఓ యువకులార జండా ఎగుర వేద్దాం
మన జండా ఎగుర వేద్దాం 2

కాశాయి రంగురా న్యాయమునకు గుర్తురా 2
రండీ ఓ యువకులార జండా ఎగుర వేద్దాం
మన జండా ఎగుర వేద్దాం 2

తెలుపు రంగు గుర్తురా పవిత్రమైన గుర్తురా 2
రండీ ఓ యువకులార జండా ఎగుర వేద్దాం
మన జండా ఎగుర వేద్దాం 2

# ఆకాశం గుండెల్లో

సుల్తాన్ **బాలాది**

ఆకాశం గుండెల్లో అగ్నికణం సూర్యుడై
ఆవేశం గుండెల్లో అరుణం ఒక వీరుడై
మత్తున ప్రవహించినపుడు వచ్చిందొక విప్లవం
దిక్కులు జ్వలిహించి తెచ్చి ఇచ్చింది స్వరాజ్యం

అందుకే అందుకే జనగణమన జయహే
జనగణమన జనయిత్రీ నా భరత భూమి
రణరాక్షర గాయత్రి నా పుణ్యభూమి
యశస్సుకే హిమాలయం ఉషస్సుల్లో మరోతరం
స్వరాక్షర చరిత్రమే సృష్టించినదీ భూమి.

వందేమాతరం వందే వందే మాతరం
ఎందరో శివమెత్తిన రుద్రులై మరెందరో ప్రళయించిన శక్తులై 2

ఉడికెత్తిన నెత్తురు నువు ఉప్పెన సృష్టిస్తే
పడగెత్తిన దొరపాలన ప్రభుత్వాలు చస్తే

ఉరికొయ్యల చాగాలకు వెయ్యి జన్మలొస్తే

ఉజ్వల భవిష్యత్తు నీకు కొత్త వెలుగు నిస్తే

గుర్తించని స్వరాజ్యం గుండె బరువు కాదా

వచ్చిన ఈ స్వరాజ్యమే వ్యర్థమైపోదా

ఆ సత్యాగ్రహ స్వరాజ్య సంరక్షమీది కాదా

వందే మాతరం వందే వందే మాతరం ॥జనగనమనజనయిత్రి॥

చ : స్వర్గమైతె వర్ధిల్లిన భూమిని ఏ స్వార్థమైతె మనిషిదోచుకుంటే 2

కడుపు తీపి కర్మం కన్నీటి శోకమా

తల్లి కొడుకు బంధం తల కొరవి కోసమా

కాదు కాదు అలా జరిగి ప్రగతి ఆగరాదు

ఉగ్గుపాల ఋణమెప్పుడు టుగ్గిపాలు కాదు

చేయి కలిసి వస్తున్నా చైతన్యం కోసం



# భవాని - స్తుతి

1. భవానీ భువనేశ్వరీం !! ఓం !! భగవతీ
జగదీశ్వరీం !! భవానీ!! పావనీ పద దాసులము
మా ప్రార్థనాలాలించ లేవా ! కావుమా
కాత్యాయనీ కరుణతో మము బ్రోవవమ్మా ॥ఏభవానీ॥

2. చండికా శివరంజనీ ॥మృధు॥ చరణములకు
సుమాంజలీ ॥చండికా॥ వెండి కొండ పుర మహేశ్వరి
వేదనా లీడేర్చరమ్మ ! అండ దండ నీవె మాకు
పండు వెన్నెల జ్యోతివమ్మా ॥భవాని॥

3. అంబికా పరమేశ్వరీ ॥జగ॥దాంబికా గిరిజేశ్వరీ ॥అంబికా॥
సంబరంబులోలుక నిన్నే స్మరించెద మను దినంబున ॥శాంభవీ॥
వరదాయినీ శత కోటి దాసుల శరణమమ్మా ॥భవానీ॥

4. ఇకానీ దయ జూపుమా ॥కడు॥ ఇడుములన్నెడ బాపుమా ॥ఇకానీ
ఒకసారి కలలో నైన వచ్చి మా కగుపించు జననీ ॥ శోక
సాంద్రములో ననేకే శ్రమల నొందియుంటిమమ్మా ॥భవానీ॥

5. ధరా శ్రీ కాన్ కుంట షౌరి ॥దేవి॥ దాసుల బ్రోచె గౌరీ ॥దరా శ్రీ॥
అరిసముగ వర వీరచార్యులు ఆత్మలో నిను సంస్కరించియు ।
పరంజ్యోతి బ్రోవుమని మీ పదములా శిరమొంచెనమ్మా
॥ భవాని ॥

# రాష్ట్రగీతం

మా తెలుగు తల్లికి మల్లెపూదండ
మా కన్నతల్లికి మంగళారతులు
కడుపులో బంగారు కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మా తల్లి ||మా||

గల గలా గోదారి కదలిపోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగు లిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొరలుతాయి ||మా||

అమరావతీనగర అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై నిఖిలమై నిలిచియుండేదాక
రుద్రమ్మ భుజశక్తి మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి కృష్ణరాయల కీర్తి
మా చెవుల రింగుమని మారుమ్రోగేదాక
నీ పాటలే పాడుదాం నీ ఆటలే ఆడుదాం
జై తెలుగు తల్లీ! జై తెలుగు తల్లీ!

—శ్రీ శంకరంబాడి సుందరాచారి

# మాతృ వందనమ్

వందే మాతరం - వందేమాతరం
సుజలాం సుఫలాం మలయజ శీతలాం
సస్యశ్యామలాం - మాతరం ॥వందే॥

శుభ్రజ్యోత్స్నా పులకితయామినీం
ఫుల్లకుసుమిత ద్రుమదళ శోభినీం
సుహాసినీం సుమధుర భాషిణీం
సుఖదాం వరదాం మాతరం ॥వందే॥

—శ్రీ బంకిం చంద్రచటర్జీ

